పశువైద్య గ్రంథమాల 4 వ పుష్పము

# ఆంగ్లేయ పశువైద్య వస్తుగుణదీపిక

గ్రంథకర్త:

"అభినవ సహదేవ" ఆయుర్వేద పశువైద్యాచార్య, వైద్యకళా
విభూషణ, పశువైద్యగ్రంథమాల, ఆయుర్వేద పశుచికిత్సా
లయ సంస్థాపకులు, ఆంధ్ర జాతీయ పశువైద్య విద్యాపీఠ
ప్రెసిడెంటు, ఆంధ్ర జాతీయ పశువైద్య
కళాశాలప్రిన్సిపాల్ నగు,

డాక్టర్ యేజెళ్ల శ్రీరాములు చౌదరి,

A. V. L. M. & S., A. M. B. & B.S.

అంగలూరు, కృష్ణాజిల్లా.



1937

 [వెల రు 0-12-0.



గ్రంథకర్త:

"అభినవసహదేవ"

యేజెళ్ల శ్రీరాములుచౌదరి

# విజ్ఞప్తి

నేను సుమారు పదిసంవత్సరములకి్రిందట ఆయుర్వేద పశుచికిత్సాలయమును ఆయుర్వేద పశువైద్య గ్రంథమాలను స్థాపించి అనుభవపూర్వకముగా నపుడపుడు పశువైద్య గ్రంథములఁ బ్రకటించుచు వార్తాపత్రికలలో వ్యాసములువ్రాయుచు నా శక్తికొలది పశుసేవ చేయుచున్నసంగతి తామెల్లరకును దెలిసియేయున్నది. నేను వ్రాసిన గ్రంథములనుబట్టియు, నా యొద్ద తరిబియతయిన వైద్యులద్వారాను, కరపత్రముల మూలకముగను ఆంధ్రదేశమందంతటను ఆయుర్వేద పశువైద్యమును వ్యాపింపజేసితిని.

మరియొక ముఖ్యవిషయమేమన నేనిప్పుడొక ఆంధ్రజాతీయ పశువైద్య కళాశాలను స్థాపించి గవర్నమెంటువారిచే రిజష్టరు చేయించి యనేకమంది పశువైద్యులను తరిబియతు చేయుచున్నాడను. ఈకళాశాల ప్రభుత్వమువారివలన త్వరలో రికగ్నైజు కానున్నది.

ప్రస్తుత కాలపరిస్థితులనుబట్టి రైతులకును విద్యార్థులకును తదితరులకును అర్థమగునటుల సులభశైలియందు ఇరువది పశువైద్య గ్రంథములను మాపశువైద్య గ్రంథమాలతరఫున బ్రకటించితిని. మా యాయుర్వేద పశువైద్య గ్రంథమాలయందు వెల్వడిన గ్రంథరాజములం దిదియు నొక్కటి. ఇయ్యది

పశుధనాభిమానులగు హైందవులకెల్లరకును హస్తభూషణమని చెప్పనగును.

మా యీగ్రంథములపై గవర్నమెంటు వెటరినరీ, అగ్రికల్చరల్, రెవిన్యూ, ఎడ్యుకేషనల్ డిపార్టుమెంటులయందలి ప్రముఖులగు నుద్యోగులును తదితర డిపార్టుమెంటులవారును జమీందారులు భూస్వాములు మున్నగు వారు పెక్కురు పెక్కు సదభిప్రాయముల నొసంగియున్నారలు.

మా యీ గ్రంథముల నాంధ్రలోకమాదరించి ప్రతి పాఠశాలయందును, ప్రతిపుస్తక భాండాగారమందును, కోఆపరేటివు సొసైటీలయందును ఉంచి మాపశువైద్య గ్రంథమాల నభివృద్ధికి దెత్తురని విశ్వసించుచున్నారము.

ఈ గ్రంథమునకు దయతో పీఠిక వ్రాసి వన్నెదెచ్చిన పశుధనాభిమాన శిరోమణికిని ముద్దులొలుకునటు లీ గ్రంథమును త్వరలో ముద్రింపించి యిచ్చిన గ్రంథాలయప్రెస్సు మానేజరు శ్రీ కుందా లక్ష్మీనరసయ్యగారికిని, నా యీ గ్రంథ రచనమునకు సాయపడిన గ్రంథముల రచయితలకును నా హృదయపూర్వక వందనము లర్పించుచున్నాడను.

ఇట్లు,

గ్రంథకర్త.

శ్రీ పశువైద్య గ్రంథాలయము
తేలప్రోలు.



# ఆంగ్లేయ పశువైద్య వస్తుగుణదీపిక

## అమ్మోనియంక్లోరిడ్

(Ammonii Chloridum. Hydrochlorate of Ammonia. Chloride of Ammonium)

ఇది తెలుపురంగుగానుండును. వెగటుగానుండును. ఇది సారాయిలోను వేడినీటిలోను కరగును. ఇది కాలేయసంబంధమగు జాడ్యములకు అనుకూలమైనది. సాధారణముగా దీనిని పొటాష్‌నైట్రేట్‌తో నేలవేముతో చేర్చివాడుదురు. పశువు పేడ బాగుగా వేయనిచో కొన్నిమందులుచేర్చి యిచ్చెదరు. ఇంకను రొంప, అజీర్తి, కామాల, లివర్‌రాట్ మొదలగు వ్యాధులకు వాడుదురు. పైకి చల్లగానుండు లోషనుగా పొటాష్‌నైట్రేట్‌తోగాని సోడియంక్లోరిడ్‌తోగాని కలిపి వాడవచ్చును.

మోతాదు:- గుఱ్ఱములకు 2 డ్రాములు, పశువులకు ½ ఔన్సునుంచి 1½ ఔన్సు, గొఱ్ఱెలకు పందులకు 20 గ్రెయినులనుంచి 1 డ్రాము, కుక్కలకు 3 నుంచి 10 గ్రెయినులవరకు.

## —♦ అమ్మోనియం కార్బనేట్ ♦—

(Ammonia Corbonate, Ammonia Carbanas, Carbonate of Ammonia)

ఇది ముక్కలుగానుండి తెలుపువర్ణముగా నుండును. ఘాటువాసన వేయుచుండును. విరేచనము గావించును. మాత్రలుగాగాని బంకనీటితోగాని కలిపి ఈయవచ్చును. కడుపు నొప్పికి కడుపులో వాయువు బాగుగాజేరినపుడు మలము పెద్ద పేగులో చిక్కుకొనిపోయినపుడు 2 ఔన్సుల కార్బనేట్‌ను ఒక ఔన్సు నక్సువామికానుజేర్చి నాలుగు మాత్రలుచేసి ఒకే మోతాదుయిచ్చిన తగ్గును. ఇంకను విషజ్వరములకు, కీటకముల కాట్లకు, దగ్గునకు, రొంపకు దీనిని వాడవచ్చును.

మోతాదు:-గు 1 నుంచి 1¼ డ్రా, పశువు½-1 ఔన్సు. గొ. పం. 15 నుంచి 30 గ్రె, కుక్కలకు 3 నుంచి 8గ్రెయినులు.

## —♦ అయోడిన్ (Iodine, Iodum) ♦—

ఇది నలుపురంగుగ నుండును. విషపదార్థము. తళతళ మెరయుచు పొరల పొరలుగా నుండును. ఇది కుళ్లకుండ జేయును. తత్వమును బాగుచేయును. దీర్ఘవాతములకు, అతి మూత్రమునకు పనిచేయును. ఇది వాపులకు, బెణుకులకు, చర్మవ్యాధులకు పనిచేయును.

మోతాదు:-30 నుంచి 60 గ్రెయినులు.

## —♦ అయోడైడ్ పొటాషియం ♦—

Iodide Potassium, Potassii Iodum.

తెలుపుగ గడ్డలుగనుండును. తత్వమును బాగుచేయును. తెలియని వ్యాధులలోకూడ ఈయవచ్చును. మూత్రమును జారీ చేయును. నంజు, వాతములు, కంతులు, రక్తసంబంధమగు వ్యాధులకన్నిటికి పనిచేయును.

మోతాదు:-1 నుంచి 3 డ్రాములు.

## —♦ ఆరిస్టాల్ (Aristol) ♦—

దీనిలో అయోడిన్, పొటాష్‌అయోడైడ్, తైమాల్ కలియును. ఇది కాల్పులకు మచ్చలకు, గాయములకు పని చేయును. ఎరుపు బూడిదరంగు కలసి తెలుపుగ నుండును. నల్లని సీసాలలో నుంచవలెను. ఈపొడికి వెలుతురు, వేడి తగిలిన చెడిపోవును.

## —♦ అసిటానిలిడమ్ ♦—

Acetanilidum, Acetanilide, Antifebrin.

ఇది వగరుగను, మూత్రవర్ధకముగను, కుళ్లకుండ జేయునదిగను నుండును. విషజ్వరములకు, అతివేడిజేసినపుడు లేహ్యముగాగాని, ఆహారముతోగాని కలిపి పెట్టవలెను. ఇంకను నీరసముగానుండు పశువులకు వాడవచ్చును.

మోతాదు:-½ నుంచి 2 డ్రాములు.

## —♦ అయిడోఫారం (Iodoform) ♦—

ఇది పసుపుపచ్చగా నుండును. కుళ్లకుండజేయును. దీనికి బలమగు క్రిమిసంహారశక్తిగలదు. గాయములకు చీముపట్టిన

పుండ్లకు కాలినబొబ్బలకు చర్మవ్యాధులకు పనిచేయును. దీనితో బోరికు ఆసిడ్ కలిపి వాడవలెను. 6 భాగముల బోరికుఆసిడ్‌లో ఒకభాగము ఈపొడికలిపి వాడిన బాగుగా పనిచేయును.

—♦ అకేసియా గం ♦—

(Acacia, Gum Acacia, Gum Arabic)

దీనిలో తుమ్మబంక కలియును. ఇది మాత్రలుచేయుటకును, ఔషధములలో కలుపుటకును, విరేచనములకు తదితర మందులలోకలిపి యిచ్చుటకును, మూత్రరోగములలో ఇంజెక్షన్ యిచ్చుటకును పనిచేయును. దీనిని కోడిగుడ్డులోని తెలుపుసొనతో కలి కాలిన భాగములకు రాసిన తగ్గును.

—♦ అకోనిటం ♦—

(Aconitum, Aconite of monkshood)

ఇదిఒకచెట్టు ఆకులనుంచి తయారగును. ఇదివాయువును పోగొట్టును. నొప్పిని తగ్గించును. వాతనొప్పులకు పనిచేయును. దాహమును తగ్గించును. జ్వరముల పోగొట్టును. దీనినే వసనాభి యందురు.

మోతాదు:-1 నుంచి 2 డ్రాములు.

—♦ అకోరస్ (Acorus, Sweet Flag) ♦—

ఇది ఆకలిని పుట్టించును. బలవర్ధకౌషధములలో కలుపుదురు. జ్వరములు, వాతములు, కడుపునొప్పి విరేచనములు మున్నగు వానికి పనిచేయును.

మోతాదు:-1 నుంచి 2 ఔన్సులు.

—♦ అల్యూమ్ (Allium, Garlic, Allium Sativa) ♦—

ఇది చురుకుదనముకలిగించును. నొప్పినితగ్గింపజేయును. దీర్ఘదగ్గులకు, ఉబ్బసమునకు పనిజేయును. ప్రేగులలోని పురుగులను నశింపజేయును.

మోతాదు:-1 నుంచి 2 ఔన్సులు.

—♦ అమ్మోనియాకం ♦—

(Ammoniacum, Gum Ammoniacum)

ఇది చురుకుదనము పుట్టించును. నొప్పిని తగ్గించును. మూర్ఛకు, దగ్గులకు పనిచేయును. దీర్ఘకీళ్లనొప్పులకు పని చేయును.

మోతాదు.-2 నుంచి 4 గ్రెయినులు.

—♦ అనేతుం ♦—

(Anethum, Dill, Anethum graveolens.)

దీనిని ఒకవిధమైన పండ్లనుంచి తయారుచేయుదురు. చురుకుదనము కలిగించును. వాయుహరమైనది. ఆకలిని బుట్టించును. అజీర్తికి పనిచేయును.

మోతాదు:-1 నుంచి 2 ఔన్సులు.

—♦ అంగ్యురెంటం ప్లంబి అసిటాటస్ ♦—

(Unguentum Plumbi Acetatis, Ointment of Acetate of Lead)

అసిటేట్ లెడ్ 12 గ్రెయినులు, వ్యాసులైను ఒకఔన్సు కలిపిన తయారగును. ఇది చర్మవ్యాధులకును, చర్మముపై పుట్టు మంటలకు పనిచేయును.

—♦ అంగ్వ్యుయెంటం ప్లంబి సుబసిటాటిస్ కంపోజిటం ♦—
(Unguentum Plumbi Subacetatis Compositum, Compound Ointment of Subacetate of Lead)

సెల్యూషన్ సుబసేటేట్ లెడ్ 6 ఔన్సులు, క్యాంఫర్ డ్రాము, మైనము 8 ఔన్సులు ఆలివ్ ఆయిల్ 20 ఔన్సులు కలిపిన తయారగును. ఇది మంటను తగ్గించును. చల్లదనముగా నుండును. నలుగుడు గాయములకు, బెణుకులకు బాగుగా పని చేయును.

—♦ అంగ్వ్యుయెంటం పొటాష్ సల్ఫు రేటెడ్ ♦—
(Unguentum Potassae Sulphuratae, Ointment of Sulphurated Potash)

సల్ఫు రేటెడ్ పొటాష్ 30 గ్రైనులు, క్రొవ్వు 1 ఔన్సు కలిపిన తయారగును. ఇది మచ్చలకు, చర్మరోగములకు పనిచేయును.

—♦ అంగ్వ్యుయెంటం పొటాష్ అయోడైడ్ ♦—
(Unguentum Potassi Iodide Ointment of Iodide of Potassium)

పొటాషియం అయోడైడ్ 64 గ్రై, పొటాష్ కార్బనేట్ 4 గ్రై, క్రొవ్వు 1 ఔన్సు, డిస్టిల్డువాటరు 1 డ్రాము కలిపిన తయారగును. ఇది అన్ని చర్మరోగములకు అమోఘముగా పనిచేయును.

—♦ అంగ్వ్యుయెంటం రెజిన్ ♦—
(Unguentum Resinae. Ointment of Resin, Digestive Ointment.)

రెజిన్ 8 ఔన్సులు, మైనము 4 ఔన్సులు, క్రొవ్వు

16 ఔన్సులు కలిపిన అగును. చల్లగా నుండును. కాలిన బొబ్బలకు, పొక్కిన భాగములకు పనిచేయును.

—♦ అంగ్వ్యుయెంటం సల్ఫురిస్ కంపోజిటుం ♦—

(Unguentum Sulphuris Compositum, Compound Ointment of Sulphur)

సల్ఫర్ 16 ఔన్సులు, టర్పెంటైన్ 4 ఔన్సులు, మెర్క్యురీ ఆయింటుమెంటు 2 ఔన్సులు, లిన్‌సీడ్ ఆయిల్ 20 ఔన్సులు కలిపిన తయారగును. దీనిని పొడలకు, తేనెటీగలు విషపురుగులు చర్మమునకు కుట్టినపుడు నుపయోగించ వచ్చును.

—♦ అంగ్వ్యుయెం టంగాల్సుకం ఓపియం ♦—

(Unguentum Gallaecum opii, Ointment of galls with opium)

గాల్సుఆయింటుమెంటు ఒకఔన్సు, నల్లమందు 32 గ్రెయిలునుకలిపిన పై ఆయింటుమెంటగును. బాధగా మంటగానుండు వ్రణములకు, గాయములకు దీనిని వాడిన బాగుగా పని చేయును.

—♦ అంగ్వ్యుయెంటం హైడ్రాగ్రిజరీ ♦—

(Unguentum Hydrargyri, Mercurial ointment, Blue ointment)

మెర్క్యురీ 16 ఔన్సులు, స్వ్యూటు 1 ఔన్సు, కొవ్వు 16 ఔన్సులు కలిపిన పై ఆయింటమెంటగును. కీళ్ళవాపులకు, కంతులకు, వ్రణములకు, చర్మవ్యాధులకు పనిచేయును.

—♦ అంగ్వుయెంటం హైడ్ర్యాజరీ అయోడైడ్‌రుబ్రిం ♦—

(Unguentum Hydragyri Iodide Rubrie, Ointment of Red Iodide of Mercury, Blistering ointment)

రెడ్‌అయోడైడ్ మెర్క్యురీపౌడరు 16 గ్రెయినులు, వ్యాసులైను 1 ఔన్సు కలిపిన యగును. దీనిని గట్టికంతులకు, మిడికి, గట్టిగానుండు అరుగ్రివాపులకు వాడిన పనిచేయును. జాగ్రత్తగా వేయవలెను. తదితరచోట్లవేసిన పొక్క పుండగును.

—♦ అంగ్వుయెంటం హైడ్రాగ్రిజరీనైట్రిటిస్ ♦—

(Unguentum Hydragyri Nitratis, Ointment of Nitrate of Mercury)

మెర్క్యురీ 4 ఔన్సులు, నైట్రికుఆసిడ్ 12 ఔన్సులు ఆలివ్‌ఆయిల్ 32 ఔన్సులు, వ్యాసులైను 15 ఔన్సులు కలిపిన తయారగును. ఇది దీర్ఘచర్మరోగములకు, కంటివాపులకు బాగుగా పనిచేయును.

—♦ అంగ్వుయెంటం అయోడిన్ ♦—

(Unguentum Iodine, Ointment of Iodine)

అయోడిన్ 32 గ్రెయినులు, పొటాషియం అయోడైడ్ 32 గ్రెయినులు, స్పిరిట్ 1 డ్రాము, వ్యాసులైను 2 ఔన్సులు కలిపిన అయోడిన్ ఆయింటుమెంటగును. ఇది కంతులకు, కూటిగడ్డలకు బాగుగా పనిచేయును.

—♦ అంగ్వుయెంటం పీసిస్‌లిక్వేడ్ ♦—

(Unguentum Picis Liquidae, Ointment of Tar)

తారు 5 ఔన్సులు, మైనము 2 ఔన్సులు కలిపిన తయారగును. ఇది గిట్టలపుండ్లకు బాగుగా పనిచేయును.

—♦ అంగ్వ్యుయెంటం ఆసిడ్ కార్బాలిక్ ♦—

(Unguentum Acidi Carbolici Ointment of Carbolic acid)

కార్బాలిక్ ఆసిడ్ ఒకఔన్సు వ్యాసులైనుగాని క్రొవ్వుగాని 8 ఔన్సులుకలిపిన ఈఆయంటుమెంటగును. ఇది కురుపులకు గాయములకు వాడవచ్చును.

—♦ అంగ్వ్యుయెంటం ఆసిడ్ కార్బాలిక్ కంపోజిటం ♦—

(Unguentum Acidi Carbolici Compositum Compound Carbolic Acid Ointment)

కార్బాలిక్ ఆసిడ్ ఆయంటుమెంటు 6 ఔన్సులు సబ్లైమ్డ్ సల్ఫర్ 2 ఔన్సులు కలిపిన యిది అగును. ఇది చర్మవ్యాధులకు వ్రణములకు పనిచేయును.

—♦ అంగ్వ్యుయెంటం ఆర్జెంటి నైట్రేటిస్ ♦—

(Unguentum Argenti Nitratis, Ointment of Nitrate of Silver)

సిల్వర్ నైట్రేట్ 10 గ్రెయినులు, క్రొవ్వుగాని వ్యాసులైనుగాని ఒకఔన్సుకలిపిన యిదియగును. కంటివాపులకు, దీర్ఘకంటి పొరలకు దీనిని వాడవచ్చును.

—♦ అంగ్వ్యుయెంటం బెల్డోనా ♦—

(Unguentum Belladonnae, Ointment of Belladonna)

దీనిలో యక్స్ట్రాక్టు బెల్డోనా 80 గ్రెయినులను వ్యాసులైను 1 ఔన్సుకలియును. ఇది వాతనొప్పులకు ఇతర నొప్పులుగల భాగములకు పనిచేయును.

## —♦ అంగ్యుయెంటం కెంతారిడిస్ ♦—

(Unguentum Cantharidis Ointment of Canthârides)

కెంతారిడిస్ ఒక ఔన్సు, మైనము ఒక ఔన్సు ఆలివ్ ఆయిల్ 6 ఔన్సులు కలిపిన ఈఆయంటుమెంటగును. ఇదికూడ పొక్కుమందుగా పనిచేయును.

## —♦ అంగ్యుయెంటం కుప్రి సుబకెటాటిస్ ♦—

(Unguentum cupri Subacetatis Ointment of Subacetate of Copper)

దీనిలో పైమందు 4 డ్రాములు టర్పెంటైన్ 4ఔన్సులు క్రొవ్వు 6 ఔన్సులు కలుపుదురు. ఇదికూడ వ్రణములను మాన్పను. గాయములకు పనిచేయును.

## —♦ అంగ్యుయెంటం గాల్సు ♦—

(Unguentum Gallae Ointment of Galls)

మాచికాయపొడి 80 గ్రెయినులు, క్రొవ్వు ఒక ఔన్సు కలిపిన తయారగును. ఇదికూడ వ్రణములను గాయములను మాన్పను.

## —♦ అంగ్యుయెంటం టెరిబిన్ థైన్ ♦—

(Unguentum Terebinthinae Ointment of Turpentine Digestive Ointment)

టర్పెంటైన్ ఆయిల్ 1 ఔన్సు, రెసిన్ 1 డ్రాము మైనము 4 డ్రాములు, క్రొవ్వు 4 డ్రాములు కలిపిన తయారగును. ఇదికూడ గాయములకు పనిచేయును.

—♦ అంగ్వుయెంటం జింకుఆక్సైడ్ ♦—

(Unguentum Zinci, Ointment of Zinc oxide)

జింకుఆక్సైడ్ 8 గ్రె, వ్యాసులైను ఒకఔన్సు కలిపిన తయారగును. చిన్నకురుపులకు, పగుళ్లకు, డెక్కల గాయములకు, అణువాపులకు పనిచేయును.

—♦ అంగ్వుయెంటం ఆసిడ్ బోరికం ♦—

(Unguentum Acidi Boric, Boric ointment)

బోరిక్ ఆసిడ్ 10 గ్రె, వ్యాసులైను 20 గ్రె కలిపిన తయారగును. అన్నివాపులకు బెణుకులకు పనిచేయును.

—♦ అంగ్వుయెంటం పారఫిన్ ♦—

(Unguentum Paraffin, Paraffin ointment)

హార్డుపారఫిన్ సాఫ్టుపారఫిన్ వ్యాసులైను కలియును. ఇది చర్మవ్యాధులకు, మెత్తబరచుటకు పనిచేయును.

—♦ ఆంతెమిస్ ♦—

(Anthemis Chrmomile, Anthemis Noblis)

ఒక చెట్టుపువ్వునుంచి తయారగును. బలవర్ధకౌషధముగను, గాలిని పోగొట్టునదిగను, కడుపునొప్పికి, అజీర్తికి పనిచేయును. మోతాదు:-1 నుంచి 2 ఔన్సులు.

—♦ ఆర్మొరకియా ♦—

(Armoracia, Horseradish, Cochlearia Armoracia)

దీనిని మొక్క చెట్టువేరునుంచి తయారుచేయుదురు. మూత్రమును గావించును. దీర్ఘవాతములను పోగొట్టును.

మోతాదు:-1 నుంచి 2 ఔన్సులు.

—◆ ఆర్నికా ◆—

(Arnica, Arnica Montana)

ఇదియొక చెట్టువేరు, పువ్వులనుంచి తయారుచేయుదురు. కంతులకు, గాయములకు, బెణుకులకు, నలుగుడు గాయములకు పనిచేయును. మంటను తగ్గించును.

మోతాదు:-1 నుంచి 2 డ్రాములు.

—◆ ఆసిడ్ కార్బాలిక్ ◆—

(Carbolic Acid, Acidum Carbolicum or Liguefactum Phenol)

దీనినే కార్బాలికామ్ల మందురు. ఇది స్వచ్ఛమైనదిగ, నిర్వర్ణమైనదిగ నుండును. ఇంకను స్ఫటికముగా నుండి క్రమముగా ఎరుపురంగుగగాని, బూడిదరంగుగగాని తేలును. వేసవికాలములో ద్రవరూపముగా నుండును. శీతాకాలములో తెలుపుగ గడ్డకట్టియుండును. ఇది విషవస్తువు. ఇది వగరుగ సోకుడు పరిహారముగ నుండును. దీనిలో కుళ్ళకుండ జేయు శక్తిగలదు. చర్మమునకు తగిలిన తెలుపుగ పొక్కును. బండ పారును. ఈ ద్రావకమునకు అధికమగు క్రిమిసంహారక శక్తి గలదు. చర్మరోగములకు, గాయములకు ఒకపాలు కార్బాలిక్ ఆసిడ్ 15 భాగముల నూనెకలిపి వాడిన బాగుగా పనిచేయును. ఇంతియేగాక దొమ్మ, పెద్దరోగము, గురకమున్నగు రక్తసంబంధమగు వ్యాధులకు తగినంత మోతాదు తీసికొని జావలోగాని, నీటిలోగాని కలిపియిచ్చిన తగ్గును. ప్రత్యేకముగా దేనిలోను కలుపకుండ యిచ్చిన పశువునకు

ప్రమాదము సంభవించును. ఇంకనుతగినంత వ్యాసులైనులో ఈ మందును కలిపి చర్మవ్యాధులకు గిట్టలపుండ్లకు, గాయము లకు వాడిన బాగుగా పనిచేయును.

మోతాదు:—½ డ్రాముమునుంచి 1 డ్రాముమువరకు.

## —♦ ఆసిడ్ సల్ఫ్యూరిక్ ♦—

## (Sulphuric Acid, Acidum Sulphuricum, Oil of Vitriol)

దీనిని గంధకముచే తయారుచేయుదురు. తదితర ద్రావకములలో కలిపి ఈయవచ్చును. ఇది చాల విషసంబంధ మైనది. శరీరముమీద బడిన పొక్కును. పుండగును. మానని మొండివ్రణములకు ఒక పర్యాయము తేలికగ అంటించిన తగ్గును. విరేచనములకు ఈ మందును నీటిలో కలిపి ఈయ వచ్చును. దుర్గంధముగానుండు పుండ్లకు, తడిలేక మానని మొండిపుండ్లకు తగినంత వ్యాసులైనులో కొన్ని చుక్కలువేసి కలిపి వాడిన తగ్గును.

మోతాదు:- 2 డ్రాములనుంచి తగినన్ని నీటిలోకలిపి ఈయవలెను.

## —♦ ఆసిడ్ నైట్రిక్ ♦—

## (Nitric Acid, Acidum Nitricum)

దీనినే మహాద్రావకమందురు. ఇదియును మంచి ఘాటుగానుండును. శరీరముమీద పడిన పుండగును చాల జాగ్రత్తగా వాడవలెను. బలవర్ధకౌషధములలోను, చురుకు తనము కలిగించుటకు దీనిని తదితర ద్రావకములలో కలిపి

పెట్టవలెను. దీర్ఘగాయములకు, డెక్కమాదలకు, మానని మొండివ్రణములకు, దీనిని వాడవచ్చును.

మోతాదు:- 1 నుంచి 2 డ్రాములు.

## ఆలోజ్ (Aloes)

దీనినే ముసాంబరమందురు. ఇది విరేచనకారి. బలవర్ధకౌషధములలోను, జీర్ణరోగములలోను వాడవచ్చును. కురుపులకు గాయములకు పనిచేయును. మూత్రము తాగునపుడు వేపనూనెలో కలిపి బొడ్డునకు, నాలుకకు నాకించిన తాగుట మానును.

మోతాదు:- 1 నుంచి 2 ఔన్సులు.

## ఆర్సెనియస్ ఆసిడ్

(Arsenious Acid Acidum Arseniosum Arsenic)

ఇది మిగుల విషవస్తువు. తత్వమును బాగుచేయుటకు దీనిని బలవర్ధకౌషధములలో కలిపి వాడుదురు. చర్మరోగములకు వాడవచ్చును. చర్మముపైన రాసిన పోక్కును. ఎక్కువ మోతాదు నీయరాదు. అట్లు యిచ్చినయెడల ప్రాణాపాయము కలుగును.

మోతాదు :- గు. ప 2 నుంచి 8 గ్రె. గొ. పం. $\frac{1}{8}$ గ్రె నుంచి $\frac{3}{4}$ గ్రె, కుక్కలకు $\frac{1}{16}$ నుంచి $\frac{1}{20}$ గ్రె.

## ఆసిడ్ బోరిక్

(Boric Acid, Boracic Acid, Acidum Boricum)

దీనినే బోరి కామ్లమందురు. దీనిలో వెలిగారము కలియును. తెలుపురంగుగానుండును. మంటలేనిమందు. దీనిని ఎక్కు

వగా వాడుదురు. ఇది సూక్ష్మజీవులను వెంటనే చంపలేదుగాని వాని వృద్ధినాపును. దీనిని లోపలికిచ్చిన మూత్రవ్యాధులు తగ్గును. ఇంకను నోటిపుండ్లకు చర్మవ్యాధులకు బాగుగా పని చేయును. తగినంత వ్యాసులైనులో మైలతుత్తము, గంధకము బోరిక్ ఆసిడ్ కలిపి రాసిన గజ్జి, నుసిమిరి, తోకనుసిమిరి, రక్తనెలి మున్నగు వ్యాధులు తగ్గును. తగినంతవ్యాసులైనులో బోరిక్ ఆసిడ్ కలిపిన బోరికు ఆయంటుమెంటగును. దీనిని అరుగు వాపులకు బెణుకులకు తదితరవాపులకు మర్దనచేసి వేడికాపులు తీసిన బాగుగాపనిచేయును. రెండుభాగములు బోరిక్ ఆసిడ్ ఒకభాగము అయిడోఫారం 2 భాగములు జింకుఆక్సైడ్ కలిపి పగుళ్ళకు మానని చర్మరోగములకు రాసిన పనిచేయును.

మోతాదు:-2 నుంచి 4 డ్రాములవరకు.

## —♦ ఆసిడ్ పిక్రిక్ ♦—

## (Acidum Picricum, Picric Acid)

ఇది కాంతిగలిగి పసుపుపచ్చగానుండును. వేడినీటితో కలిపి తయారుజేసిన లోషన్‌తో కాలినపుండ్లనుకడుగవచ్చును. ఈపుండ్లకిది ముఖ్యమైనమందు. ఇంకను కాలినబొబ్బలకు మచ్చలకు వాడిన పనిచేయును.

## —♦ ఆసిడ్ సాలిసైలిక్ ♦—

## (Acidum Salicylicum, Salicylic Acid)

ఇది తెలుపుగనుండును. సూదులుసూదులుగ సన్నని కాంతిగల ముక్కలుగ నుండును. దీనిని స్పిరిట్ కలిపి ప్రతి

వారు తామరమందుగా వాడుదురు. పరబతులు మొదలగునవి చేయువారు అవి చెడిపోకుండ నిలువయుండుటకు దీనిని కలుపుదురు. తామర, గజ్జి, నుసిమిరి, మున్నగు చర్మవ్యాధులకు తగినంత వెన్నలోగాని వ్యాసులైన్‌లో కలిపి వాడిన బాగుగా పనిచేయును. ఒకభాగము కార్బాలికు ఆసిడ్ 20 భాగములు మంచినూనె 4 భా, సాలిసైలిక్ ఆసిడ్ కలిపి గాయములకు రసికారుకణతులకు అప్పుడప్పుడు రాయుచుండిన తగ్గును.

మోతాదు:-1 నుంచి 2 ఔన్సులవరకు.

## —♦ ఆసిడ్ గాలిక్ ♦—

(Gallic Acid, Acidum Gallicum)

మాచికాయనుంచి తయారగును. చురుకుదనము కలిగించును. విరేచనములు, రక్తవిరేచనములు, పేగులలోని పురుగులకు పనిచేయును.

మోతాదు:-20 నుంచి 60 గ్రెయినులు.

## —♦ ఆసిడ్ హైడ్రోక్లోరికం ♦—

(Acidum Hydrochloricum, Spirit of Salt)

ఇది బలవర్ధకౌషధములలో కలిపి వాడుదురు. చురుకుదనము కలిగించును. కుళ్ళకుండ జేయును. దీర్ఘదగ్గులకు, జ్వరములకు, రక్తసంబంధమైన రోగములకును పనిచేయును. కుళ్లుడు వ్రణములకు విషపుగాయములకు, వాడవచ్చును.

మోతాదు:-$\frac{1}{2}$ నుంచి 2 డ్రాములు.

—♦ ఆసిడం హైడ్రోక్లోరికం డిల్యూటం ♦—

(Acidum Hydrochloricum Dilutum, Diluted Hydrochloric Acid)

హైడ్రోక్లోరికం ఆసిడ్ 8 ఔన్సులు, డిస్టిల్డువాటరు 18½ ఔన్సులుకలియును. బలవర్ధకౌషధముగాను, తదితర వ్యాధులలోను కలిపి ఈయవచ్చును.

మోతాదు:-1 నుంచి 4 డ్రాములు.

—♦ ఆసిడంహైడ్రోక్యానికండిల్యూటం ♦—

(Acidum Hydrocyanicum Dilutum, Diluted Prussic Acid)

విషపుమందులు మెదడుకెక్కినపుడు, వాడవచ్చును. నొప్పిని తగ్గించుటకు, కుళ్ళిపోకుండ జేయుటకు లోపలికి వాడవచ్చును. చర్మవ్యాధులకు పైన వాడవచ్చును.

మోతాదు:-20 నుంచి 30 చుక్కలు.

—♦ ఆసిడంనైట్రిక్ డిల్యూటం ♦—

(Acidum Nitricum Dilutum, Diluted Nitric Acid)

నైట్రిక్ ఆసిడ్ 6 ఔన్సులు, డిస్టిల్డువాటరు 25 ఔన్సులు కలిపిన యగును. బలమునకు, దీర్ఘ అతివిరేచనములకు, కార్జము పెరిగినప్పుడు, చురుకుదనమునకు సోకుడును పోగొట్టుటకు వాడవచ్చును.

మోతాదు:-1 నుంచి 4 డ్రాములు.

—♦ ఆసిడం సల్ఫ్యూరిక్ డిల్యూటం ♦—

(Acidum Sulphuricum Dilutum, Diluted Sulphuric Acid)

సల్ఫ్యూరిక్ ఆసిడ్ 7 ఔన్సులు, డిస్టిల్డువాటరు 76½

ఔన్సులు కలిపిన తయారగును. మంటమందులిచ్చినపుడు, బల వర్ధకౌషధముగా కుళ్ళకుండజేయుటకు గారపట్టుటకు వాడ వచ్చును. అతిసారమునకు, అతిమూత్రమునకు, న్యూమోనియా మొదలగు వాటికి వాడవచ్చును.

మోతాదు : 2 నుంచి 4 డ్రాములు.

—♦ ఆసిడం టానికం ♦—

(Acidum Tannicum, Tannic Acid)

ఇది మిక్కిలి వగరుగనుండును. గాయములను గార పట్టించును. నీళ్ళవిరేచనములకు, రక్తభేదులకు పేగులలోని పురుగులకు వాడవచ్చును. ఇది మాచికాయనుంచి తయా రగును. కొంచెము బూడిదరంగు కలిగి పలుచని పలుకులుగా నుండును.

మోతాదు : 20 నుంచి 60 గ్రయినులు.

—♦ ఆంటోమోనియం టార్టరేటం ♦—

(Antimonium Tartaratum, Tartarated Antimony)

దీనిని పెద్దమోతాదులిచ్చిన విషముగా వర్తించును. జ్వరములకు, జలుబులకు, వాపులకు, చర్మముపైన కలుగు మంటలకు, వాపులకు పనిచేయును.

మోతాదు:- 1 నుంచి 2 డ్రాములు.

—♦ ఆమిల్ నైట్రిస్ (Amyl Nitris) ♦—

దీనిని విషసంబంధమైన పదార్థము లెక్కువగా యిచ్చి

నపుడు విరుగుడుగా యిచ్చిన తగ్గును. పసుపురంగుగానుండును. ద్రవపదార్థము. గాలి తగిలినయెడల చెడిపోవును.

మోతాదు:- 10 నుంచి 20 చుక్కలు.

—♦ ఆంటిపైరిన్ (Antipyrine, Phenazonum) ♦—

కుక్షిళ్ళకు చల్లజేయుటకును, నరములలో వేడి జేరినపుడు దీనిని వాడవచ్చును. జ్వరమును తగ్గించును. నిర్వర్ణముగా నుండును. చేదుగ నుండును. పలుకులుగ నుండును.

మోతాదు:- 3 నుంచి 6 డ్రాములు.

—♦ ఎక్స్ట్రాక్టమ్ అకోనిటి ♦—

(Extractum Aconiti, Extract of Aconite)

అకోనిట్‌తో తయారగును. ప్రమాదకరమైనవిషముగా ప్రవర్తించినపుడును, పక్షవాతములో నరములు బాగుపడుటకును, నొప్పిని తగ్గించుటకును దీనిని వాడవచ్చును. జ్వరములకు, జలుబులకు, వాతములకు, అంగవికృతిరోగమునకు వాడవచ్చును.

మోతాదు:-15 నుంచి 20 గ్రయినులు.

—♦ ఎక్స్ట్రాక్టమ్ బెల్డోనా ♦—

(Extractum Belladonnae, Extract of Belladona)

బెల్డోనాతో తయారగును. నలుపురంగుగా నుండును. ఇన్ఫ్లూయిఁజా, గురక, కుత్తుకవాపు, జలుబు, న్యూమోనియాలకు పనిచేయును. ఒకవిధమైన వాసనకలిగి యుండును. ఇది నరములసంబంధమగు బాధలను తగ్గించును.

మోతాదు:-1 నుంచి 2 డ్రాములు.

### ఎక్స్ట్రాక్టమ్ కెన్నబిస్ ఇండికా

(Extractum Cannabis Indicae, Extract of Indian Hemp)

గంజాయితో తయారగును. చురుకుదనముకలిగించును. నొప్పిని తగ్గించును. మత్తుగానుండును. ధనుర్వాతము, నరముల బలహీనత, వాతములు, కడుపునొప్పి మున్నగువాటికి పని చేయును. జిగురుగ నుండును.

మోతాదు:-2 నుంచి 4 డ్రాములు.

### ఎక్స్ట్రాక్టమ్ డిజిటాలిస్

(Extractum Digitalis, Extract of Digitalis)

పెద్దమోతాదునిచ్చిన విషముగా ప్రవర్తించును. మూత్రమును జారీచేయును. నొప్పిని పోగొట్టును. దీర్ఘవాతములకు గుండెజబ్బులకు దీర్ఘదగ్గులకు పనిచేయును.

మోతాదు:-4 నుంచి 15 గ్రియినులు.

### ఎక్స్ట్రాక్టమ్ ఎర్గోటాలిక్విడం

(Extractum Ergotae Liquidum, Liquid Extract of Ergot)

ఇది ఎర్గోటా చేయుపనియే చేయును.

మోతాదు:-2 నుంచి 4 డ్రాములు.

### ఓలియం క్రోటన్ (Oleum Crotonis, Crotan Oil)

నేపాళగింజలనుంచి తయారగును. పై భాగమునరాసిన మంటగానుండును. వాతనొప్పులకు, బెణుకులకు, చర్మవ్యాధులకు పనిచేయును.

మోతాదు:-½ నుంచి 2 డ్రాములు.

—♦ ఓలియం జూనిపర్ ♦—

(Oleum Juniperi, Oil of Juniper)

ఇది ఒకవిధమైన పండ్లనుంచి తయారగును.

మోతాదు:-1 నుంచి 2 డ్రాములు.

—♦ ఓలియం లిన్‌సీడ్ ♦—

(Oleum Lini, Linseed Oil)

అవిసెనూనె యందురు. కడుపునొప్పి,అతిసారము, తత్వ మును బాగుచేయుటకు, జీర్ణసంబంధమగు వ్యాధులకు, చర్మ వ్యాధులకు పనిచేయును.

మోతాదు:-1 నుంచి 2½ పౌనులు.

—♦ ఓలియం మోర్హ్యాయ్ ♦—

(Oleum Morrhuae, Cod Liver Oil)

బ్రిటన్, ఐర్లండు, ఫ్రాన్సు, నార్వే చేపలనుండి తయా రగును. తత్వమును మృదువుపరచును. బలముగలిగించును. దీర్ఘవాతములకు పనిచేయును.

మోతాదు:-6 నుంచి 8 ఔన్సులు.

—♦ ఓలియం నూసిస్ ♦—

(Oleum Nucis, Cocoanut Oil)

కొబ్బరినూనె. దీనిని పైకి, లోపలికి వాడవచ్చును.

మోతాదు:- 20 నుంచి 40 ఔన్సులు.

—♦ ఓలియం ఆలివ్ ♦—

(Oleum Olivae, Oileve Oil)

ఆలివ్ పండ్లనుంచి తయారగును. లిన్‌సీడ్ ఆయిల్ వలె అన్నిజంతువులకు పనిచేయును.

—♦ ఓలియం ప్టిచోటిస్ ♦—

(Oleum Ptychotis, Omum Oil, Ajwain Oil)

దీనినే వాముఅరఖు అందురు. దీర్ఘవాతజీర్ణ రోగములకు పనిజేయును.

మోతాదు:- 1 నుంచి 2 డ్రాములు.

—♦ ఓలియం రెసిని ♦—

(Oleum Ricini, Castor Oil)

దీనినే క్యాస్టర్ ఆయిల్ అందురు.

మోతాదు:- 1 నుంచి 1½ పౌనులు.

—♦ ఓలియం సేసమం ♦—

(Oleum Sesamum, Jinisili Oil)

ఇదికూడ ఆలివ్ ఆయిల్‌వలె పనిచేయును. పుండ్లను బాగుచేయుటకు, వ్రణములకు పనిచేయును. విరేచనములకు వాడవచ్చును.

మోతాదు:- 1 నుంచి 2 పౌనులు.

—♦ క్లోరల్ హైడ్రేట్ ♦—

(Chloral Hydrate, Chloral Hydras)

ఇది నిర్వర్ణమైన స్ఫటికములుగ నుండును. దీనిలో మత్తును కలుగజేయు గుణము కలదు. నల్లమందువలెనే పని చేయును. మత్తునుకలుగజేసి నొప్పిని తగ్గించును. నీటిలోగాని అవిసెనూనెలోగాని బంకనీటిలోగాని కలిపి ఈయవచ్చును. కడుపుబ్బునకు, కడుపునొప్పికి టర్పెంటైన్ 2 ఔన్సులు, క్లోరల్‌హైడ్రేట్ ఒకఔన్సు, ఆలోస్ 5 డ్రాములు, లిన్‌సీడ్

ఆయిల్ తగినంత కలిపి యిచ్చిన తగ్గును. పశువు ఈచుకొని పోయి బాధపడుచున్నపుడు, దూడను బయటకులాగినపుడు, ఈనినతరువాత నొప్పులు ఎక్కువగా వచ్చుచున్నప్పుడు ఈ మందును గంజితో కలిపి యిచ్చిన నొప్పితగ్గును. ఇంకను వాతలువేయునపుడును, శస్త్రము చేయునపుడును మత్తుమందుగా నీయవచ్చును.

మోతాదు:- ½ నుంచి 2 ఔన్సులవరకు.

## —♦ క్రియోసోట్ (Creosote) ♦—

ఇది కొంచెము పసుపురంగుగగాని, నిర్వర్ణముగగాని యుండి ఒకవిధమైన వాసనగలిగి యుండును. ఇది కార్బాలిక్ ఆసిడ్‌గుణములనే కలిగియున్నది గాని అంతవిషకరమైనది కాదు. పైన రాచినయెడల పొక్కుగుణము కలదు. దుర్వాసనపోగొట్టునదియు, క్రిమ్లకుండ జేయునదియును గూడనై యున్నది. ఇది పొక్కుమందుగ, మంటగ పనిచేయును. ఈగలు వాలుచున్నపుడు టర్‌పెన్‌టైనులోకలిపి రాయవచ్చును. పెద్ద రోగముసోకినపుడు జావలోగాని గంజిలోగాని రెండుపర్యాయములు యిచ్చిన తగ్గును. ఇంకను దీనిని వాసనచూచుటవలన విషక్రిములు చనిపోవును. వ్యాసులైనులో క్రియోసోట్‌ను తగినంతకలిపి చర్మరోగములకు రాచిన బాగుగా పనిచేయును.

మోతాదు:- 1 నుంచి 2½ డ్రాములు.

## —♦ క్రేటాప్రెపరేటా ♦—

(Creta Praeparata, Prepared Chalk)

మామూలు సున్నమునుంచి తయారు చేయబడును.

ఇది విరేచనముల కట్టించును. ముడ్డితీపు తగ్గించును. పులుసు వాసన పోగొట్టును.

మోతాదు:- 2 నుంచి 4 ఔన్సులు.

—♦ కెంతారిడీస్ (Cantharidis, Canthris) ♦—

ఈ మందులో పొక్కుగుణము కలదు. ఆవాలవలె పొక్కుమందుగా వాడవచ్చును. 30 చుక్కలను తులమువ్యాసు లైనులోగాని, ఆలివ్ఆయిల్‌లోగాని కలిపి వాడవచ్చు ఎక్కువగా వాడిన పశువునకు జ్వరమువచ్చును.

—♦ కాల్సియం క్లోరీడ్ ♦—

Ca ci i Chloridum, Calcium Chloride)

ఇదికూడ సున్నమునుంచి తయారగును. గాలితగిలిన ద్రవరూపముగా నగును. తెలుపురంగుగల గడ్డలుగా నుండును. దీనిని చర్మవ్యాధులకును, రసికారుపుండ్లకును వాడవచ్చును. ఇంతియేగాక పశువులకు గాలికుంటుమీాదవచ్చు కసిమిరిఅను వ్యాధికి, లిక్కర్ఆర్సెని కానిస్ అరఔన్సు, కాల్సియంక్లోరీడ్ 2 డ్రాములు కలిపి దినమున కొక మోతాదువంతున పక్షము దినములు పెట్టిన తగ్గును.

మోతాదు:-1 నుంచి 2½ డ్రాములవరకు.

—♦ కాల్సియం ఫాస్ఫస్ ♦—

(Calcii Phosphas, Phosphate of Lime)

దూడల ఎముకలకువలయు సున్నపు పదార్థము జేర్చుట యందును, సాధారణముగా శరీరమునకు బలము నిచ్చుట యందును యిది పనిచేయును. బలవర్ధకౌషధములలో కలిపి

చూడిపశువులకు ఈయవచ్చును. దూడలకు వచ్చునెలజబ్బులకు, పాండురోగములకు ఈయవచ్చును.

మోతాదు:-½ నుంచి 2 డ్రాములు.

—♦ కాల్సియం సల్ఫైడ్ ♦—

Calcii Sulphas,Sulphate of Lime,Calcined Gypsum, Plaster of Paris)

ఇది తెలుపుగా నుండును. విరిగిన భాగములకు నీటితో తగినంత కలిపి దూదివేసి కట్టుకట్టిన గట్టిగాబిగియును. క్రమేపి విరిగిన భాగములు కట్టుకొనును.

—♦ క్రిసాల్ ♦—

(Cresol, Cresylic Acid)

దీనిని ఆపరేషను కేసులలో వాడవచ్చును. గాయములకు వేయవచ్చును. పశువు మందమతిగ నుండునపుడును, పారుడెక్కువగా నుండునపుడును గంజిలోకలిపి ఈయవచ్చును.

మోతాదు:-½ నుంచి 1½ డ్రామువరకు.

—♦ కెరోసినాయిల్ ♦—

(Kerosine Oil)

ఈ నూనె క్రిమిని చంపును. నువ్వులనూనెతోగాని ఆముదముతోగాని కలిపి రాసిన చర్మరోగములు, గాయములు మానును.

—♦ కుప్రి సల్ఫస్ ♦—

(Cupri Sulphas, Blue stone Copper Sulphate)

మైలతుత్తముతో తయారగును. రక్తస్రావము నణ

చును. చర్మరోగముల పోగొట్టును. గాలికుంటు పుండ్లకు తారులోకలిపి రాచిన తగ్గును.

—♦ జెంటియన్ (Gentiana, Gentina) ♦—

ఇదియొక చెట్టువేరుతో తయారగును. బలవర్ధకౌషధములలో కలిపివాడిన బాగుగా పనిచేయును. ఇది వగరుగ, చేదుగ, రుచిగ నుండును.

మోతాదు:-2 నుంచి 6 డ్రాములు

—♦ జింకు అసిటేటస్ ♦—

(Zinci Acetatis, Acetate of Zinc)

చురుకుదనము గలిగించును. గారపట్టును. గాయములకు వాపులకు వాడవచ్చును.

—♦ జింకు కార్బనేట్ ♦—

(Zinc Carbonate, Zinci Carbonas)

రక్తస్రావము నణచును. దీర్ఘ అంటురోగములలో ప.. చేయును.

—♦ జింకు క్లోరిడ్ ♦—

(Zini Chloridum, Chloride of Zinc, Butter of Zinc)

ఇది అన్నిగాయములకు, మాదలకు, డెక్కగాయములకు పనిచేయును.

—♦ జింకు సల్ఫస్ ♦—

(Zinci Sulphas, Sulphate of Zinc)

అతిసారమునకు, బలవర్ధకౌషధములలో కలిపి ఈయవచ్చును. కంటివాపులకు, అవిరికి, పుండ్లకు పనిచేయును.

మోతాదు:-2 నుంచి 3 డ్రాములు.

## — టర్పెంటైన్ —

(Oil of Turpentine, Oleum Terebinthinae, Rectificatum, Rectified Oil of Turpentine)

దీనిని కర్పూరమునుండి తయారుచేయుదురు. ఇది స్వచ్ఛముగ, నిర్మలముగ నుండును. దీనిని ఆవిరిరూపముగ తయారు చేయుదురు. ఇది చురుకుదనమును గలిగించును. నొప్పిని పోగొట్టును. వాయువును హరింపజేయును. కుళ్ళి పోకుండజేయును. పై భాగమందు వాడిన మంటగానుండును. న్యూమోనియా, కసిమిరి, నొుగబంతి, పీనస మున్నగు రోగములకు దీనిని ఆవిరిరూపముగా చేసివాడిన తగ్గును. చర్మముపై నుండు పురుగులను చంపును. లోపలనుండు ఎలికపాములు మున్నగు వాటిని హరింపజేయును. సమస్త బెణుకులు, వాపులు, గాయములకు పనిచేయును. ఇంతియేగాకుండ జీర్ణసంబంధమగు రోగములు అనగా కడుపుబ్బు, కడుపునొప్పి, శూలకు బాగుగా పనిచేయును. కర్పూరతైలము 5 తులములు, ఇంగువ 1 తులము, అవిసెనూనె ఒకపౌను కలిపి దీర్ఘకడుపునొప్పి, కడుపుబ్బులకు యిచ్చిన బాగుగా పనిచేయును. దీనిని బంకనీటితో గాని, తైలములలోగాని, పాలలోగాని కలిపి ఈయవలెను.

మోతాదు:- 1 నుంచి 2 ఔన్సులవరకు.

## —♦ తైమాల్ (Thymol) ♦—

దీనినే వాముపువ్వందురు. జీర్ణరోగములకు బాగుగా పనిచేయును. దీర్ఘకడుపునొప్పికి, శూలకు దీనిని దూడలకు, పెద్ద వాటికి వాడవచ్చును.

మోతాదు:- ½ నుంచి 1 డ్రాముమువరకు.

## —♦ టింక్చర్ అయోడిన్ ♦—

## (Tincture Iodine)

అయోడిన్ అరఅవున్సు, , పొటాషియం అయోడైడ్ అరఔన్సుగాని పావుఔన్సుగాని, రెక్టిఫైడ్‌స్పిరిట్ 20 ఔన్సులు కలిపిన టింక్చర్ అయోడిన్ అగును. ఇది ఎరుపురంగుగ నుండును. దీనిలో మిక్కిలి తీవ్రమైన శక్తిగలదు. నిమిష ములో సూక్ష్మజీవులను చంపును. శస్త్రముచేయుటకుముంద దీనిని వాడుదురు. ఇది పుండునకు తగిలిన మంటగలుగును సమస్తగాయములకు, వాపులకు, బెణుకులకు బాగుగా పని చేయును. ఈ మందు ప్రతి డాక్టరుదగ్గర నుండవలెను. పైభాగ ముల ప్రకారము మనమే తయారుచేసికొని వాడవచ్చును. అప్పుడేతగిలిన గాయములకు మాత్రము దీనిని వేయరాదు. ఎందుచేతనన - మంటగానుండును. మందగుదికి దీనిని ఇంజెక్షను యిచ్చిన తగ్గును.

మోతాదు:- 1 నుంచి 3 డ్రాములు.

## —♦ టింక్చర్ జింజిబరిస్ ♦—

## (Tincture Zingiberis)

ఇది శొంఠితో తయారగును. నీటిలో కలిపిన పాలవలె నుండును. శొంఠిపొడి 2½ అవున్సులును, రెక్టిఫైడ్‌స్పిరిట్ 20 అవున్సులు కలిపిన టింక్చర్ జింజిబరిస్ అగుచున్నది. ఇది వాతజీర్ణరోగముల కన్నిటికి బాగుగా పనిచేయును.

మోతాదు:- 2 నుంచి 4 ఔన్సులవరకు.

## —♦ టొబాకో(Tobacum, Tobacco) ♦—

పొగాకు చేదుగనుండును. వాయువును హరింపజేయును. నొప్పిని తగ్గించును. మిన్నల్లులను, పేలను చంపును.

మోతాదు:-1 నుంచి 2 డ్రాములు.

## —♦ టెరెబింతినవెనెటా ♦—

## (Terebinthina Veneta Venice Turpentine)

మూత్రమును జారీచేయును. చురుకుదనముకలిగించును.

మోతాదు:-1 నుంచి 3 ఔన్సులు.

## —♦ టింక్చర్ ఓపియం (Tincture Opium) ♦—

దీనినే నల్లమందుద్రావక మందురు. నల్లమందు 1½ ఔన్సు, ప్రూఫ్‌స్పిరిట్ 20 ఔన్సులుకలిపిన టింక్చర్ ఓపియం అగును. లైసెన్సు లేనిది దీనిని వాడరాదు. అనగా రిజిస్టర్డు ప్రాక్టీషనర్ మాత్రమే వాడవలెను. తదితరులు వాడరాదు. ఇదినొప్పిని తగ్గించుటకు, భేదులు, రక్తాతిసారము, శరీరములోనుండు తదితర నొప్పులకు పనిచేయును.

మోతాదు:-1 నుంచి 2½ అవున్సులు.

## — ♦టింక్చర్ అసఫటీడా (Tincture Assafoedita) ♦—

దీనినే ఇంగువద్రావకమందురు. 2½ అవున్సుల ఇంగువను 20 ఔన్సుల రెక్టిఫైడ్ స్పిరిట్‌లో కలిపిన టింక్చర్ అసఫటీడా అగుచున్నది. వాత, జీర్ణరోగములకు బాగుగా పనిచేయును.

మోతాదు:-2 నుంచి 4 ఔన్సులు.

—♦ టింక్చర్ కార్డమంస్ (Tincture Cardmoms) ♦—

దీనిని యాలకులతో తయారుచేయుదురు. ఏలకులు 14 అవున్సులు, దాల్చినచెక్క 2 అవున్సులు, ప్రూఫ్‌స్పిరిట్ 20 అవున్సులు కలుపుదురు. ఇది వాయుహరమైనదిగను, జీర్ణశక్తి కలుగజేయునదియును, ఆకలిని పుట్టించునదిగను పనిచేయును. చిన్నదూడలు తెల్లగాపారునపుడు దీనితో యింగువ ద్రావకము కలిపి యిచ్చిన తగ్గును.

మోతాదు:-4 నుంచి 8 అవున్సులు.

—♦ టింక్చర్ కెంథారిడిన్ (Tincture Cantharides) ♦—

కెంథారిడిన్ పౌడరు పావుఅవున్సు, ప్రూఫ్‌స్పిరిట్ 20 అవున్సులు కలిపిన అగుచున్నది. ఇది బలవర్ధకౌషధముగను ఆకలిని పుట్టించునదిగ పనిజేయును.

మోతాదు:-3 నుంచి 5 అవున్సులవరకు.

-♦ టింక్చర్ కెనేబిస్ ఇండికా ♦-
(Tincture Cannabis Indica)

గంజాయినుంచి తయారుచేయుదురు. గంజాయిపత్రి 1 అవున్సు రెక్టిఫైడ్ స్పిరిట్ 20 అవున్సులు కలిపి తయారుచేయుదురు. ఇదికూడ ఆకలిని బుట్టించును. ఇది ఆకుపచ్చరంగుగ నుండును. గంజాయి చేయుపనియే యిదియును చేయును.

మోతాదు:-1నుంచి 2అవున్సులు.

—♦ టింక్చర్ ఆర్నికా (Tincture Arnica) ♦—

ఆర్నికావేరు ఒకఅవున్సు, రె. స్పిరిట్ 20 అవున్సులతో

తయారుచేయుదురు. ఇది తత్వమును బాగుచేయుటకును, ఆకలిని పుట్టించుటకును, వాపులకు, వాతములకు లోపలికి పైకి కూడ వాడవచ్చును.

మోతాదు:-1 నుంచి 2 డ్రాములు.

—♦ టింక్చర్ ఆకోనైటు (Tincture Aconite) ♦—

ఈ అరకు జీర్ణశక్తికిని, నొప్పిని పోగొట్టుటకును, పైనొప్పులకు రాయుటకును ఉపయోగించెదరు. జ్వరములకు వాత నొప్పులకు వాడుదురు.

మోతాదు:- 40 నుంచి 60 చుక్కలవరకు.

—♦ టింక్చర్ చైరేటా (Tincture Chiretta) ♦—

నేలవేము 2½ అవున్సులు, రె. స్పిరిట్ 20 అవున్సులు కలిపిన తయారగును. దీనిని బలవర్ధకౌషధములలో కలిపి వాడుదురు. జ్వరములను తగ్గించును.

మోతాదు:-4 నుంచి 6 అవున్సులు.

—♦ టింక్చర్ సింకోనా (Tincture Cinchona) ♦—

సింకోనా 4 ఔన్సులు, రె. స్పిరిట్ 20 అవున్సులు, కలిపినతయారగును. సింకోనాచేయు పనియే ఇదియును చేయును.

మోతాదు:-3 నుంచి 6 అవున్సులు.

—♦ టింక్చర్ కాప్సికం (Tincture Capsicum) ♦—

మిర్చితో తయారగును. దీనిని జీర్ణరోగములకు ఎక్కువగా వాడవచ్చును.

మోతాదు:-½ నుంచి ¾ అవున్సులు.

—♦ టింక్చర్ డిజిటాలిస్ (Tincture Digitalis) ♦—

నలుపు బూడిదరంగు కలదిగానుండును. బలవర్ధకౌషధముగ వాడుదురు. మోతాదు:-1 నుంచి 4 డ్రాములు.

—♦ టింక్చర్ జెంషైన్ (Tincture Gentian) ♦—

దీనిని బలవర్ధకౌషధముగను, వాతజీర్ణరోగములలోను వాడుదురు.

మోతాదు 1 నుంచి 2 అవున్సులు

—♦ టింక్చర్ నక్సువామికా ♦—
(Tincture Nux Vomica)

విషముష్టిగింజలతో తయారగును. బలవర్ధకౌషధములలోను, పక్షవాతము, అజీర్తి, మలబద్ధకము మున్నగువాటికి వాడవచ్చును. మోతాదు:- ½ నుంచి 1 అవున్సువరకు.

—♦ టింక్చర్ ఫెర్రిఫర్క్లోరిడ్ ♦—
(Tincture Ferri Perchloride)

దీనిని పైకి లోపలికికూడ వాడ వచ్చును. రక్తస్రావము నణచునదిగ, బలవర్ధకౌషధముగ, పనిజేయును.

మోతాదు:- 1 నుంచి 2 అవున్సులు.

—♦ టింక్చర్ కాచు (Tincture Catechu) ♦—

ఇది కవిరితో చేయబడును. కాఫీరంగువలె నుండును. అతిసారము, రక్తాతిసారములకు పనిచేయును.

మోతాదు ½ నుంచి 1 అవున్సు.

--♦ టింక్చర్ బెల్లోనా (Tincture Belladona) ♦--

ఇదికూడ కాఫీరంగువలె నుండును. కఫరోగములకు, మూత్రరోగములకు పనిచేయును.

మోతాదు:- ½ నుంచి 1 అవున్సు.

--♦ టింక్చర్ క్యాంఫర్కో ♦--
(Tincture Camphorco)

కర్పూరముతో తయారగును. ఇది ఎరుపురంగుగా నుండును. శ్వాసరోగములకు, చర్మవ్యాధులకు పనిచేయును.

మోతాదు:- 1 నుంచి 3½ అవున్సు.

--♦ టింక్చర్ బెంజాయిన్కో ♦--
(Tincture Benzoinco)

సాంబ్రాణితో తయారగును. సువాసనగానుండును. దగ్గు, రొంప, మొగబంతి మున్నగు వ్యాధులకు పనిచేయును. గాయములకు, చర్మరోగములకు వాడవచ్చును.

మోతాదు:- 1 నుంచి 2 అవున్సులు.

—♦ టింక్చర్ఎర్గోటా (Tincture Ergot) ♦—

పశువులకుగలుగు గర్భరోగములకు వాడుదురు.

మోతాదు:- 1 నుంచి 1½ అవున్సు.

--♦ టింక్చర్కలంబ (Tincture Calumba) ♦--

ఇదియొక చెట్టువేరు. ఈవేరుతోతయారగును. దీనిని

చురుకుదనమునకు, దీర్ఘ అజీర్తికి, జీర్ణశక్తి కలుగుటకు, తదితర బలవర్ధకౌషధములలో కలిపి యిచ్చుటకు వాడుదురు.

మోతాదు :- 1 నుంచి 2 ఔన్సులు.

## —♦ టింక్చర్ కాల్చికం (Tincture Colchicum) ♦—

ఇది దీర్ఘవాతములకు, జీర్ణరోగములకు మెగ్నీషియం సల్ఫేటుతో కలిపియిచ్చిన తగ్గును.

మోతాదు :- ½ నుంచి 1 ఔన్సు.

## —♦ పొటాషియంపర్మాంగనేట్ ♦—

(Potassii Permanganate, Permanganate of Potassium Permanganate of Potash)

దీనినే పొటాషియంపర్మాంగనిత యందురు. ఇది ఊదారంగుగల పలుకులుగ నుండును. దీనికి అధికమగు క్రిమి సంహారశక్తి గలదు. అందుచేతనే పశువులకు కలుగు రక్త సంబంధమగు రోగములకు అనగా గురక, దొమ్మ పెద్దరోగము లకు నీటిలో కలిపి లోపలికి యిచ్చుదురు. ఈ పొడిని నీటిలో కలిపినప్పుడు చంద్రకాంతివంటి ఎరుపురంగుగల ద్రవ మేర్పడును. ఈ ద్రావకము కుళ్ళుచుండు పదార్థములతో చేరినపుడు ప్రాణవాయువు వెలువడి అది ఆ పదార్థములతో కూడి వానిని శుద్ధిచేయును. దీనిలో దుర్వాసనపోగొట్టు గుణముకలదు. నూరు భాగముల నీటిలో ఒక భాగము పొడి కలిపి శస్త్రచికిత్స చేసినపుడు తదితర పుండ్లను కడుగుటకు

లేపనుగా నుపయోగించును. ఆపరేషనుచేయు పనిముట్లు ఈ లోషనులో వేసిన త్వరలో నల్లబడును.

మోతాదు:- 2 నుంచి 4 డ్రాములవరకు

## —♦ పొటాష్ క్లోరస్ ♦—

(Potassii Chloras, Chlorate of Potassium, Chlorate of Potash)

ఇదినిర్వర్ణమైన పలుకులుగ నుండును. పటికవలెనే యిది యును పనిచేయును. నీటిలో చక్కగా కలియును. నోటినుంచి నీరు కారునపుడు, దీర్ఘపడిశమునకు, అర్లుకత్తిరించిన తరువాత బాధగా నున్నపుడు, నోరు పూచినపుడు, చెల్దికి, నాలుక వాచినపుడు ఈ మందును లోపలికి బైటకు వాడవచ్చును. రెండువేళల బెల్లముతోగాని, చూర్ణములతోగాని కలిపి ఈయవలెను. బోరాక్సుతోగాని, తేనెతోగాని కలిపి నాలుకకు నాకించవలెను.

మోతాదు:- ½ నుంచి 1 ఔన్సువరకు.

## —♦ పొటాష్ కాస్టికస్ ♦—

(Potassii Caustica, Hydrate of Potash, Caustic Potash)

ఇది తెలుపురంగుగనుండి పుల్లలవలె నుండును. ఇది ఎక్కువస్థలము నాక్రమించు గుణము కలదు. కాబట్టి దీనిని వేయదలచుకొన్న భాగమునకు చుట్టును క్రొవ్వును దేనినైనను కలిపి ఉపయోగించవలెను. అనారోగ్యకరమగు నానుడుకురుపులకు ఉపయోగించిన గుణ మీయగలదు. ఎక్కువ మోతాదులుగా వాడినయెడల ఒకవిధమైన మంటగానేర్పడి విషముగా

పరివర్తించును. గిత్తదూడలకు కొమ్ములుపెరుగక ఆటంకము కలిగినపుడు దీనిని పైకి రాయువచ్చును.

—♦ ఫినైల్ (Phenyle) ♦—

ఇది నలుపురంగుగ నుండును. నీటిలో కలిపిన తెలుపు రంగుగా నగును. వేడిజేయును. క్రిమిసంహారక శక్తిగలదు. చర్మరోగములకు, రక్తసంబంధమగు రోగములకు పని జేయును. పెద్దరోగమునకు, గురకకు దీనిని లోపలికి వాడ వచ్చును.

మోతాదు:- ½ నుంచి 5 డ్రాములు.

—♦ పొటాష్‌బైకార్బనస్ ♦—

(Potassii Bicarbonas, Bicarbonate of Potash, Bicarbonate of Potassium)

ఇది తెలుపువన్నెగల లవణము. నీటిలోకలియును. పొటాషియం సంబంధమగు ఔషధములకన్నిటికి యుండెడి గుణములు ఈలవణము నందొక్కదానికే గలవు. ఇది వాతము లకు, తత్వమును బాగుచేయుటకు వాపులకు కుళ్లిన స్థలము లకు పనిచేయును.

మోతాదు :- 1 నుంచి 1½ ఔన్సులవరకు.

—♦ పొటాష్‌నైట్రస్ ♦—

(Potassii Nitras, Nitrate of Potassium, Nitrate of Potash, Nitre Saltpetre).

దీనినే సూరేకారమందురు. ఇది పొడుగగుముక్కలుగా నుండి స్ఫటికములవలె మెరయుచుండును. మంచి చురుకైన

పదార్థము. రుచికికారముగ చిరుచేదుగ నుండును. ఇది సామాన్యముగా తత్వమును చక్కబరచును. జ్వరముగనున్న పశువునకు సురక్షితముగా దీని నీయవచ్చును. దీనిని గంజిలోగాని, నీటిలోగాని కలిపి దాహముగా నీయవచ్చును. ఇది మూత్రమును వృద్ధిజేయును. వేసవికాలములో వేడిజేసినపుడును, శిలామేహవాతము, శేరుమాద, నీరు చురుకు మొదలగు వ్యాధులలో బాగుగాపనిచేయును. మేయి దిగినప్పుడు చూడిపశువు మీద మగపశువు ఎక్కి మానమువాచినప్పుడు ఈమందును తగినంత తీసికొని చన్నీటిలో కలిపి ఆభాగములకు రెండు మూడుసార్లు కొట్టిన తగ్గును.

మోతాదు :- 4 నుంచి 8 డ్రాములవరకు.

## —♦ పొటాష్ ఆసిటస్ ♦—

## (Potassii Acetas, Acetate of Potassium, Acetate of Potash)

ఇది రక్తములో త్వరగా మిశ్రితమగును. ఎక్కువ మోతాదునిచ్చిన విరేచనము కలుగును. జ్వరములకు మూత్ర రోగములకు పనిచేయును. మొత్తముమీద నిదికూడ పొటాష్ నైట్రేట్‌తో సమానముగ పనిచేయును.

మోతాదు :- 4 నుంచి 10 డ్రాములవరకు.

## —♦ ఫార్మలిన్ (Formalin) ♦—

ఇది విషవస్తువు. ప్రతిగాయమునకు వ్రణమునకు ఈ ద్రావకమును వాడరాదు. అట్లు వాడిన ఆ భాగమంతయు

తినివేయును. అపరిమితముగుమంటగా నుండును. ఎంతో మొండి కేసులోతప్ప అనవసరముగా వాడరాదు. కొమ్ములు విరిగి నపుడుచీముపట్టినపుడు దీనిని లోషనుగా కలిపివాడవచ్చును. కడుపుబ్బునకు, కడుపునొప్పికి బెల్లపునీటితో కలిపి 2 డ్రాముల వరకు ఈయవచ్చును. చర్మరోగములకు బాగుగాపనిచేయును.

మోతాదు :- 1 నుంచి 3 డ్రాములు.

—♦ ఫెనుగ్రీక్ (Fenugreek) ♦—

ఇది ఒకవిధమైన గింజలపొడి, జీర్ణరోగములలో కడుపుబ్బు, కడుపునొప్పి మున్నగు వ్యాధులలో వాడుదురు.

మోతాదు:-½ నుంచి 1 ఔన్సు.

—♦ ఫిలిక్సు (Filix Male Fern) ♦—

ఇదియొక బెరడునుంచి తయారుచేయుదురు. విరేచనకారిగ పనిచేయును. క్రిమిని చంపును.

మోతాదు:-1 నుంచి 4 ఔన్సులు.

—♦ ఫెన్నల్ (Fennel, Foeniculum) ♦—

ఇదికూడ ఒకచెట్టుయొక్క పండ్లనుంచి తయారగును. తత్వమును మృదువుపరచును. వాయువును హరింపజేయును. మూత్రమును గావించును. మోతాదు:-1నుంచి 2 ఔన్సులు.

—♦ ఫెర్రిసల్ఫస్ (Ferri Sulphas, Sulphate of Iron) ♦—

అన్నభేదితో తయారగును. బలవర్ధకౌషధములలోకలిపి ఈయవచ్చును. రక్తస్రావము నణచును.

మోతాదు:-2 నుంచి 6 డ్రాములవరకు.

## —♦ మెగ్నిషియం సల్ఫేటు ♦—

(Magnesia Sulphate, Sulphate of Magnesium, Epsom Salt, Magsulph)

ఇది తెలుపుగ నుండును. విరేచనము గావించును. తత్వము మార్పుగలిగించును. జ్వరములకు పనిచేయును. దీనిని లోషన్‌గాచేసి కీళ్ళవాపులకు, బెణుకులకు వాడవచ్చును. లోపల గాలిచేరియున్నయెడల సొంటిపొడితో కలిపి ఈయలెను. గోరువెచ్చని నీటితోగాని, బెల్లపునీటితోగాని ఈయవచ్చును. మోతాదు:-½ పౌనునుంచి 2 పౌనులవరకు.

## —♦ మెగ్నిషియం కార్బనేట్ ♦—

(Magnesiae Carbonate, Carbonate of Magnesia)

ఇదియును తెలుపుగానుండును. బరువునకు తేలికగానుండును. ఇదియును పై దానివలనే పనిచేయును.

## —♦ యెర్గోటా (Ergota) ♦—

ఇది కుక్కగొడుగు సంబంధమైనది. పెద్దమోతాదుల నిచ్చినయెడల మరణము సంప్రాప్తమగును. గర్భరోగములకు పనిచేయును. రక్తస్రావము నణచును. ఈనినతరువాత గూడ దీనిని ఈయవచ్చును.

మోతాదు:-2 నుంచి 4 డ్రాములు.

## —♦ యెంబిలికా ఆఫ్ఫినాలిస్ ♦—

(Emblica Officinalis, Emblica, Myrobalans)

ఇది ఒకచెట్టు పండ్లనుంచి తయారగును. విరేచనకారి

గను, వగరుమందుగను వాడవచ్చును. చర్మవ్యాధులకు, మురికి వ్రణములకు నేతిలోగాని, నూనెలోగాని కలిపి వాడవచ్చును.

మోతాదు:—2 నుంచి 4 డ్రాములు.

—• యెంబిల్యా రైబెస్ •—

(Embelia Ribes, Berries of Burn)

ఇది ప్రేగులలోని నులిపురుగులను చంపును.

మోతాదు:-2 నుంచి 6 డ్రాములు.

—• లెడ్ అసిటేట్ •—

(Led Acetate, Plumbi Acetate, Sugar of Lead)

దీనిని అతిసారమునకు, నీళ్ల విరేచనములకు, నల్లమందుతో కలిపి లోపలికి ఈయవచ్చును. ఇంకను రక్తస్రావము నణచుటకు వాడవచ్చును. లోషన్‌గాచేసి గారపట్టుటకు, చల్లదనమునకు, నలుగుడు గాయములకు, వాపులకు, బెణుకులకు వాడవచ్చును. ఈలోషనునే వైట్ లోషన్ (White Lotion) అందురు. దీనిలో $\frac{3}{4}$ న వంతు జింకుసల్ఫేటును, ఒక భాగము లెడ్ అసిటేట్‌ను కలిపిన ఈ లోషను అగుచున్నది. కొమ్ములు విరిగినపుడును, పైతోడుగు లూడినపుడును ఈ లోషనువేసి కట్టు కట్టిన మంట, పోటు తగ్గి క్రిమిపి మానును.

మోతాదు:-$\frac{1}{2}$ నుంచి 1 డ్రాము.

—• లిక్కర్ ఆసిడ్ కార్బాలిక్ •—

(Liquor Acidi Carbolici, Solution of Carbolic Acid)

ఒక అరఔన్సు కార్బాలిక్ ఆసిడ్‌లో 20 అవున్సుల నీరు

పోసి కలిపిన సెల్యూషను అగుచున్నది. ఇది కుళ్లుడు వ్రణములు కడుగుటకు, ఆపరేషన్ చేసినపుడు గాయములు కడుగుటకును, చర్మవ్యాధులలో నుపయోగించుటకును ఈ సెల్యూషన్ బాగుగా పనిచేయును.

## లిక్కర్ ఆలోజ్

(Liquor Aloes, Solution of Aloes)

ఒక పౌను ఆలోజ్‌ను, 16 ఔన్సుల ప్రూఫ్ స్పిరిట్‌ను, 5 భాగముల డిస్టిల్డు వాటరును కలిపిన ఈ సెల్యూషనగుచున్నది. ఇది తత్వమును బాగుచేయుటకును, విరేచనకారిగ పనిచేయును. మోతాదు:-8 నుంచి 16 ఔన్సులవరకు.

## లిక్కర్ అల్యూమినిస్

(Liquor Aluminis, Solution of Alum)

ఆలం ఒక ఔన్సును 16 ఔన్సుల డిస్టిల్డు వాటరులో కలిపిన సెల్యూషనగును. ఇది నోటిగాళ్ళకు, నాలుకపూతకు, గిట్టలపుండ్లకు, చర్మరోగములకు, రక్తస్రావము నణచుటకు పనిచేయును.

## లిక్కర్ అమ్మోనియా

(Liquor Ammonia, Solution of Ammonia)

అమ్మోనియా సెల్యూషను 20 ఔన్సులును, డిస్టిల్డు వాటరు 40 ఔన్సులు కలిపిన ఈ సెల్యూషనగును. ఇది విషజ్వరములకు, దీర్ఘపడిశములకు, కడుపుబ్బునకు, వాతములకు, దీర్ఘకీళ్లనొప్పులకు పనిచేయును.

మోతాదు.- 2 నుంచి 4 ఔన్సులు.

## —• లిక్వర్ అమ్మోనియా ఆసిటేటిస్ •—

(Liquor Ammoniae Acetatis, Solution of the Acetate of Ammonia)

అమ్మోనియా కార్బనేట్ 3½ ఔన్సులు, యాస్టిక్ ఆసిడ్ 10 ఔన్సులు, డిస్టిల్డు వాటరు 50 ఔన్సులు కలిపిన ఈ సెల్యూషనగుచున్నది. ఇది దాహము తగ్గించును. మూత్రమును గావించును. జ్వరములకు, ఊపిరితిత్తుల వాపులకు బాగుగా పనిచేయును.

మోతాదు:- 4 నుంచి 8 ఔన్సులవరకు.

## —• లిక్వర్ అమ్మోనియా ఫార్టస్ •—

(Liquor Ammoniae Fortior, Strong solution of Ammonia)

అమ్మోనియంక్లోరిడ్ 48 ఔన్సులు, స్లేకెడ్ లైం 64 ఔన్సులు, డిస్టిల్డు వాటరు 32 ఔన్సులు కలిపిన ఈ సెల్యూషనగుచున్నది. దీనిని బెణుకులకు వాతనొప్పులకు కర్పూర తైలములో కలిపివాడిన బాగుగా పనిచేయును. దీర్ఘకడుపుబ్బులకు దీనిని తదితరమందులతో కలిపి ఈయవచ్చును. వాసన చూడరాదు. చాల ఘాటుగా నుండును.

మోతాదు:- 1 నుంచి 3 డ్రాములు.

## —• లిక్వర్ స్ట్రిక్నైన్ •—

(Liquor Strychniae, Solution of Strychnia)

దీనిలో స్ట్రిక్నైన్, హైడ్రోక్లోరిక్ ఆసిడ్, రె. స్పిరిట్, డిస్టిల్డు వాటరు కలియును. దీనిని బలవర్ధకౌషధముగను, ఆకలిని

కలిగించుటకును చిన్నచిన్న మోతాదులుగా వాడవలెను. ఎక్కువ మోతాదులుగా వాడిన విషముగా వర్తించును. ఇంకను చర్మవ్యాధులకుకూడ వాడవచ్చును. ఉంగిడికి పక్షవాతమునకు ఈ సెల్యూషనును ఇంజెక్షన్ ఈయవచ్చును.

మోతాదు:- 2 నుంచి 6 డ్రాములు.

—♦ లిక్కర్ ఆర్సెనికాలిస్ ♦—

(Liquor Arsenicalis, Solution of Arsenic)

దీనిలో ఆర్సెనియస్ పౌడరు, పొటాష్ కార్బనేట్, డిస్టిల్డువాటరు కలియును. దీనిని శ్వాససంబంధమగు వ్యాధులకును, కసిమిరికి వాడవచ్చును. ఇదికూడ విషసంబంధమైనది. ఇంకను చర్మవ్యాధులకు కూడ వాడవచ్చును.

మోతాదు:- 1 నుంచి 2 ఔన్సులు.

—♦ లిక్కర్ కాల్సిస్ ♦—

(Liquor Calcis, Solution of Lime)

స్లేక్డుసున్నము 2 ఔన్సులు, డిస్టిల్డువాటరు ఒకగాలను కలిపిన ఈసెల్యూషనగుచున్నది. ఇది విషపుమందు లిచ్చినపుడు విరుగుడుగా పనిచేయును. దుర్గంధములను పోగొట్టును. విరేచనముగావించును. మోతాదు :- 4 నుంచి 6 ఔన్సులు.

—♦ లిక్కర్ అయోడిన్ ♦—

(Liquor Iodine, Solution of Iodine)

అయోడిన్ 30 గ్రెయినులు, పొటాషియం అయోడైడ్ 30 గ్రెయినులు, డిస్టిల్డువాటరు 1 ఔన్సు కలిపిన అయోడిన్

సెల్యూషనగును. దీనిని చర్మవ్యాధులకు, గాయములకు, వాడవచ్చును. రక్తసంబంధమైన రోగములకు ఈసెల్యూషను ఇంజెక్షన్ ఈయవచ్చును.

## —♦ లిక్కర్ ప్లంబి సబ్ ఆసిటటిస్ డిల్యూటస్ ♦—

## (Liquor Plumbi Subacetatis Dilutus, Diluted Solution of Subacetate of Lead)

దీనిలో రె. స్పిరిట్, డిస్టిల్డు వాటరు సెల్యూషన్ సబ్ కెటేట్ లెడ్‌ను కలియును. గట్టి బిరడాతో బిగించవలెను. ఇది నొప్పిని పోగొట్టును. రక్తస్రావము నణచును. వాపులకు, కాల్పులకు, నలిగినగాయములకు, బెణుకులకు, కీళ్లనొప్పులకు, చర్మరోగములకు బాగుగాపనిచేయును.

## —♦ లిక్కర్ పొటాష్‌నైట్రిస్ ♦—

## (Liquor Potassae Nitratis, Solution of Nit rate of Potash)

నైట్రేట్‌పొటాష్ ఒకఔన్సు, డిస్టిల్డువాటరు 7 ఔన్సులుకలియును. ఇది వాపులకు ఇతరపుండ్లకు గాయములకు బెణుకులకు, మంటలకు, బాగుగాపనిచేయును.

## —♦ లిక్కర్ పొటాష్‌పర్మాంగనేట్ ♦—

## (Liquor Potassae Permanganatis, Solution of Permanganate of Potash)

పర్మాంగనేట్ 80 గ్రెయినులు, డిస్టిల్డువాటరు 20 ఔన్సులు కలియును. ఇది గాయములను కడుగుటకు, క్రిమిని చంపుటకు, రక్తసంబంధమగు రోగములలో యిచ్చుటకు పనిచేయును.

—♦ లిక్కర్ జింకుక్లోరైడ్ ♦—

(Liquor Zinci Chloridi, Solution of Chloride of Zinc, Butter of Zinc)

ఇది కంతులను కరగించును. మురికివ్రణములను, గాయములను మాన్పును.

—♦ సోడాబైకార్బనేట్ ♦—

(Soda Bicarbonate, Bicarbonate of Sodium, Sodii Bicarbonas)

దీనినే సోడాఉప్పు అందురు. తెలుపురంగుగ నుండును. ఉప్పగ చిరిచేదుగ నుండును. నీటిలో చక్కగా కలియును. జీర్ణవాతరోగములలో పనిచేయును. బలవర్ధకౌషధములలో కలిపి వాడవచ్చును. కడుపునొప్పి, కడుపుబ్బు, శూల మున్నగు వ్యాధులలో నీటితోగాని, తదితర చూర్ణములతోగాని కలిపి వాడవచ్చును.

మోతాదు:-½ నుంచి 1 ఔన్సు.

—♦ సోడాసాలిసైలస్ (Soda Salicylas) ♦—

ఈపొడి తెలుపుగానుండి మెరయుచుండును. ఇది వాతరోగములకు, బాగుగా పనిచేయును. దీనితో వాతరోగములలో కలుగు నొప్పులకు, వాపులకు చర్మముక్రిందకు ఇంజెక్షన్ చేయుదురు.

మోతాదు:-½ నుంచి 1½ ఔన్సు.

## —♦ సోడియం క్లోరిడ్ ♦—

(Sodium Chloride, Common Salt, Sodii Chloridum)

ఇది తెలుపుగా నుండును. కడుపునొప్పికి, తత్వమును బాగుచేయుటకు రెండు మూడు ఔన్సులు ఆహారములో కలిపి రెండువేళల ఈయవచ్చును. రక్తమూత్రిమను వ్యాధి ఆరంభములో దీనిని అరపౌను పొడి నీటిలోకలిపి ఈయవచ్చును. ధనుర్వాతమునకు రక్తము చెడకుండ దీనితో ఇంజెక్షన్ ఈయవచ్చును. కంటి తెలుపులకు దీనిని ఒకసావుచిటికె అప్పుడప్పుడు వేసిన తగ్గును. విరేచనములకు కూడ ఈయవచ్చును. మోతాదు:-½ నుంచి 1 పౌనువరకు.

## —♦ సోడాసల్ఫస్ ♦—

(Soda Sulphate, Sodii Sulphas, Glaubers Salt)

ఇదియును వాతరోగములలో విరేచనము కానప్పుడును, మలబద్ధకముగా నున్నపుడును నీటిలోగాని బెల్లపునీటిలోగాని కలిపి ఈయవచ్చును. మెగ్నీషియం సల్ఫేటువలనే పనిచేయును. మోతాదు:- 1 నుంచి 1¼ పౌనువరకు.

## —♦ సల్ఫర్ సబ్లిమాటం ♦—

(Sulphur Sublimatum, Flowers of Sulphur)

ఇది పసుపురంగుగనుండును. దీనినే గంధకమందురు. విరేచనమగుటకును, తత్వమును బాగుపరచుటకును, బలవర్ధకౌషధములకు, సమస్త చర్మవ్యాధులకు బాగుగా పని చేయును. మోతాదు:-4 నుంచి 5 అవున్సులు.

—♦ సల్ఫురస్ అయోడం ♦—

(Sulphuris Iodidum, Iodide of Sulphur)

అయోడిన్ 4 ఔన్సులు సల్ఫర్ 1 ఔన్సు కలియును. చర్మవ్యాధు లన్నిటికి పనిచేయును.

—♦ స్ట్రిక్నైన్ (Strychina, Strychnia) ♦—

నక్సువామికాతో తయారగును. విషవంతమైనది. ఆకలిని పుట్టించును. పక్షవాతములలో వాడవచ్చును.

మోతాదు:-1 నుంచి 3 గ్రెయినులు.

—♦ సోడాహైపోసల్ఫేట్ ♦—

(Sodii, Hyposulphis, Hyposulphite of Soda)

దీనిని ద్రావకములలోను, చూర్ణములలోను, బలవర్ధకౌషధములలోను కలిపి వాడవచ్చును. నుసిమిరికి ఒకభాగపు మందును 10 భాగములలో కలిపి రాసిన తగ్గును.

మోతాదు:-½ నుంచి 1 ఔన్సు.

—♦ స్పిరిట్సు ఈతర్ నైట్రిస్ ♦—

(Spiritus Aetheris Nitrosi, Spirit of Nitrous Ether, Sweet spirit of Nitre)

ఇది ఘాటుగానుండును. ఇది జ్వరములకు, కుళ్ళకుండ జేయుటకు, మూత్రము జారీయగుటకు, వాయువును హరింపజేయుటకు దీనిని నీటితో కలిపి వాడవలెను. ఈ ద్రావకము చేతిమీదపడిన పొక్కును.

మోతాదు:-2 నుంచి 4 ఔన్సులు.

—♦ స్పిరిట్స్ అమ్మోనియా ఆరోమాటికస్ ♦—

(Spiritus Ammoniae Aromaticus, Aromatic Spirit of Ammonia)

ఇది పులుపును కొట్టివేయునదిగను, జీర్ణశక్తిని కలుగ జేయునదిగను, నొప్పిని తగ్గింపజేయునదిగ నుండును.

మోతాదు:-2 నుంచి 4 అవున్సులు.

—♦ స్పిరిట్స్ అమ్మోనియా ఫెటిడ్ ♦—

(Spiritus Ammoniae Faetidus, Fotid Spirit of Ammonia)

ఇది జీర్ణరోగములలో పనిచేయును. కడుపునొప్పి కడుపుబ్బులకును, ఆకలిని పుట్టించుటకును, నొప్పిని తగ్గించుటకును వాడవచ్చును. మోతాదు:-1 నుంచి 2 అవున్సులు.

—♦ స్పిరిట్స్ కాంఫర్ ♦—

(Spiritus Camphorae, Spirit of Camphor)

ఇది వాపులకు, బెణుకులకు, వాతనొప్పులకు, పక్షవాతమునకు పనిచేయును.

మోతాదు:-2 నుంచి 4 అవున్సులవరకు.

—♦ స్పిరిట్సు క్లోరోఫారం ♦—

(Spiritus Chloroformie, Spirit of Chloroform, Chloric Ether)

ఇది కూడ జీర్ణశక్తి కలుగుజేయును, చురుకుదనము కలిగించును, నొప్పిని తగ్గించును. వాయువును హరింపజేయును. రొంప సంబంధమగు రోగములలో పనిచేయును.

మోతాదు:-1 నుంచి 3 ఔన్సులు.

## —♦ సిల్వర్ నైట్రేట్ ♦—

(Silver Nitrate, Lunnar Caustic, Argenti Nitras)

ఇది తెలుపుగా నుండును. దీనిని లోషనుగాజేసి మురికి వ్రణములకు, వాపులకు, కంటిపొరలకు, వాడవచ్చును. పొరలకు అవిరికి అరగ్రైయిను నుంచి 2 గ్రైయినులవరకు తీసికొని ఒక అవున్సు నీటిలో కలిపి వాడిన తగ్గును. ఇంకను మసకలకు, కన్నుకనపడనపుడు 4 గ్రైయినుల మందును ఒక అవున్సు నీటిలో కలిపి నెమ్మదిగా ఈకెతో రాయవలెను.

సిల్వరు నైట్రేట్, ఆలంకలిపిన పోట్టర్గాల్ అగును. ఇది మంటయుండదు. అవిరికి కంటిజబ్బులకు అర్జరాల్‌ను వాడవచ్చును. దీనిలోకూడ సిల్వర్ నైట్రేట్ కలియును.

మోతాదు:-1 నుంచి 6 గ్రైయినులవరకు.

## —♦ సల్ఫర్ సబ్లిమటం ♦—

(Sulphur Sublimatum, Sublimed Sulphur, Flowers of Sulphur)

దీనినే గంధకమందురు. దీనిలో కుళ్లకుండజేయు శక్తి గలదు. తత్వమును చక్కబరచును. నగరుగ నుండును. విరేచనము గావించును. క్రిమిని సంహారించును. వాత, జీర్ణ, చర్మ రోగములలో బాగుగా పనిచేయును.

మోతాదు:-2 నుంచి 4 ఔన్సులవరకు.

## —♦ సింకోనా (Cinchona) ♦—

ఇది జ్వరములకు మంచిమందు. ఇంకను బలవర్థకౌషధములలో కలిపి వాడవచ్చును.

మోతాదు:- ½ నుంచి 1 ఔన్సువరకు.

## —♦ సోప్సు (Soaps) ♦—

సల్ఫర్, కార్బాలిక్, ఇత్సాత్, సోపులు ఎనీమా చేయుటకు, విరేచనములగుటకు వాడుటకు మంచివి. ఈథర్ సోపు చేతులు కడుగుకొనుటకు పనిచేయును. సోపుతో లినిమెంటుచేసి వాతనొప్పులకు వాడవచ్చును.

## —♦ హైడ్రోజన్ పెరాక్సైడ్ ♦—

(Hydrogen Peroxide, Liquor Hydrogeni Peroxide,)

ఇది ప్రాణవాయువుతో తయారగును. ఇది కుళ్లును తీసివేయును. గాయములను శుభ్రపరచును. శస్త్రసంబంధమగు కేసులన్నిటిలోను నిత్యము వాడవచ్చును. సీసా మూతతీసియుంచరాదు. అట్లుంచిన దానిలోనుండు శక్తితగ్గును. పుండ్లమీద వేసిన పొంగును.

## —♦ హైడ్రార్జిరికం కేట్రా ♦—

(Hydrargyrum CumCreta, Mercury With Chalk)

దీనిలో ఛాక్, మెర్క్యూరీ కలియును. దూడల అజీర్తి విరేచనముల కట్టించును. తత్వమును బాగుచేయును. ఇది బూడిద, నీలివర్ణము గలిసిన పొడిగానుండును.

మోతాదు :- 5 నుంచి 15 గ్రెయినులు

## —♦ హైడ్రాజరీ ఆక్సైడ్ రుబ్రం ♦—

(Hydrargy ri Oxidum Rubrum, Red Oxide of Mercury)

దీనిలో నైట్రిక్ ఆసిడ్, మెర్క్యూరీ, నీరు కలియును. ఇది కూడ చర్మవ్యాధులకే పనిచేయును.

## —♦ హైడ్రాజరీ ఆక్సైడం ఫ్లావం ♦—

(Hydrargyri Oxidum Flavum, Yellow Mercuric Oxide)

ఇది పసుపుపచ్చగానుండు పొడి. నేత్రవ్యాధులకు వ్యాసులైనులో కలిపి వాడిన తగ్గును. కంటివాపులకు కంటివ్రణములకు, అవిరిక, దుర్మాంసములకు ఈమందు బాగుగాపని చేయును.

## —♦ హైడ్రాజరీ సబ్ క్లోరిడం ♦—

(Hydrargyri Subchloridum, Calomel Mercurous Chloride,)

దీనిలో మెర్క్యూరీసల్ఫేట్, సోడియంక్లోరిడ్ కలియును. భేదిమందులతో కలిపి ఈయవచ్చును. రక్తస్రావము నణచును. క్రిములనుచంపజేయును. నొప్పినితగ్గించును. అజీర్తి, ప్రేగులలో నొప్పికి పనిచేయును.

మోతాదు :- 1 నుంచి 2 డ్రాములు

## —♦ హైడ్రాజరీపర్‌క్లోరిడ్ ♦—

(Hydrargyri Perchloridum, Mercuric Chloride, Perchloride of Mercury)

మెర్క్యూరీసల్ఫేటు, సోడియంక్లోరిడ్‌తో ఇది తయారగును. ఆపరేషన్ కేసులలో వాడవచ్చును. గాయములకు, తదితర శస్త్రపుండ్లకు వాడవచ్చును. కంతులకు గూటిగడ్డలకు పనిచేయును.

మోతాదు :- 5 నుంచి 20 గ్రెయినులు

## —♦ హైడ్రాజరీఅయోడైడ్‌రుబ్రం ♦—

(Hydrargyri Iodidum Rubrum, Biniodide of Mercury,Red Mercuric Iodide, Red Iodide of Mercury)

దీనిలో మెర్క్యూరీపర్‌క్లోరిడ్, పొటాషియంఅయోడైడ్ కలియును. ఇది మంచిపొక్కుమందు. ఎరుపురంగుగల పొడిగానుండును. తత్వమును మార్పుజేయుటకు, కుళ్లకుండ జేయుటకు, గట్టికంతులకు, గట్టివాపులకు, అరుగ్రివాపులకు బాగుగా పనిచేయును. ఒకభాగము మందును 4 భాగముల వ్యాసులైనులో కలిపి వాపులకురాసిన పొక్కును. క్రిమేపి వెన్న రాసిన తగ్గును. ఇంకను కంతులకు రేజీకటికి ఈ మందు పొడి 5 గ్రెయినులును, పొ. అయోడైడ్ 10 గ్రె. గంజిలో కలిపి 10 దినములిచ్చిన తగ్గును. పాలుపడుటకుకూడ ఈ మందు పొడి 5 గ్రె. పొ. అయోడైడ్ 10 గ్రె. నీరు ఒక ఔన్సు కలిపి కుడితిలో పెట్టిన పాలుపడును.

మోతాదు:- 5 నుంచి 10 గ్రెయినులు.

—♦ హార్డుసోప్ ♦—

(Supo Durus, Hard Soap)

ఆలివ్ ఆయిల్, సోడాకలియును. ఇది మూత్రమును గావించును. చురుకుదనము కలిగించును. సోపుసెల్యూషను విషపుమందులకు విరుగుడుగా నీయవచ్చును. ఎనీమాచేయు నీటిలో కలుపవచ్చును. బెణుకులకు, వాతనొప్పులకు తదితర మందులలో కలిపి వాడవచ్చును.

—♦ సాఫ్టుసోప్ ♦—

(Supo Mollis, Soft Soap)

ఆలివ్ ఆయిల్, పొటాష్ కలియును. అన్నిలినిమెంటులలో కలిపి వాడవచ్చును.

—♦ సోపులినిమెంటు ♦—

(Linimintum Soaponis, Soap Liniment)

దీనిలో సాఫ్టుసోపు, క్యాంఫర్, డిస్టిల్డువాటరు, ఆల్కహాలు కలియును. ఇది చర్మమును శుభ్రముచేయుటకు పనికివచ్చును. కుక్కలను శుభ్రముచేయుటకు వాడవచ్చును.

—♦ ఈథర్ సోపు ♦—

(Ether Soap)

ఇది చేతులు కడుగుకొనుటకు మంచిది. ఇంకను కార్బాలిక్, సల్ఫరు, ఇత్నాల్, మార్గోసా, సన్ లైటుసోపులు గలవు. గట్టిసబ్బులు ఎనీమాలకు పనికిరావు.

## —♦ హార్డుపారఫిన్ ♦—

(Paraffinum Durum, Hard Paraffin · Paraffin Wax)

ఇది తెలుపుగానుండును. కరగించిన కరగును. గట్టిగా నుండును. ఇది ఆయింటుమెంట్సులో కలుపుదురు.

## —♦ సాఫ్టుపారఫిన్ ♦—

(Paraffinum Molle, Soft Paraffin, Vaseline)

పసుపుపచ్చగా తెలుపుగానుండును. పెట్రోలియంతో తయారు చేయబడును. చర్మమును మెత్తగిలజేయును. చర్మపు మంటను తగ్గించును. దీనిని అన్ని ఆయింటుమెంట్సులోను కలుపుదురు.

## —♦ పారఫినంలిక్విడం ♦—

(Paraffinum Liqudum, Liquid Paraffin or White Vaseline Oil)

ప్రేగులజబ్బులకును, లినిమెంట్సులోను, ఆపరేషన్ కేసులలోను వాడవచ్చును.

## —♦ పారఫిన్ ఆయిల్ ♦—

(Paraffin Oil, Lamp Paraffin)

ఇది తామర, గజ్జిమున్నగు చర్మరోగములకు పని చేయును.

## —♦ నాప్తాలిన్ ♦—

(Naphthalene, Tar Camphor)

ఇది అతిసారమునకు, విరేచనములకు, ప్రేగులలోని కుళ్లుదనమునకు పనిచేయును. గ్లిసరీన్‌తో కలిపి చర్మవ్యాధులకు వాడవచ్చును.





| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్ |
| | పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPWAn02B188 |
| పుస్తకం పేరు | లింగరాజు చరిత్రము |
| తారీఖు | 26-10-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 67 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | cu56, Bci,iii |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | KDaveen |
| పరీక్ష చేసినది | lakshmi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |